ఇట్లు శ్రీ మత్సదాచార్య కృపాలబ్ధ సారస్వతుఁడగు శ్రీకృష్ణ
మాచార్య శతావధాని కృతులందు నాంధ్రపద్యసహిత
మ న స్సం దే శ కా వ్య ము న
ప్ర థ మో చ్ఛ్వా స ము,
ఓం త త్స త్.

## ( క ఠి న ప ద ప్ర దీ పి క )

1. జీవమనగాఁదగు = ప్రాణితుల్యురాలు, జీవాత్మ యనబడునది; ప్రకృతి భవ్య = స్వభావముచే నుత్తమురాలు, మూలప్రకృతికన్న విలక్షణ మయినది, భవ = సంసారము; ఫలములు = పండ్లు, ధర్మార్థకామ మోక్షరూప పురుషార్థములు; పాత్రము = ఆధారము, యోగ్యము; సుమనోవిచిత్రము = పుష్పములచే చిత్రమైనది, విద్వాంసులకు విచిత్రకర మైనది; క్షేత్రము = పంటభూమి, శరీరము, పురుషార్థ యోగ్యమైన శరీరమని తాత్పర్యము.
2. ద్విజప్రవరుచే = శ్రేష్ఠమయిన పక్షిచే, బ్రాహ్మణ శ్రేష్ఠుడయిన యాచార్యులచే; హృన్నాయకుఁ = ప్రాణనాథుని, ఈశ్వరుని; మృదుల హృత్పంకేజము = మృదుల + హృత్ +, పంకేజము = మిక్కిలి మృదువయిన హృదయ కమలమున, మృదులహృత్ + పంకేజ, మృదువైన లోపలి భాగము గల కమలము.
3. అంతరంగుఁ = మనస్సు కలసినవాని, మనస్సును.
5. మహాత్కులజాతుడు = గొప్పకులమున బుట్టినవాడు, మహత్తత్త్వముయొక్క వంశన బుట్టినది, మూల ప్రకృతివలన మహత్తత్త్వము, దానివలన యహంకారము, ఇది మూడువిధము, సాత్వికము, రాజసము, తామసమని, సాత్వికాహంకారమువలన పంచ భూతములు, తామసాహంకారము వలన ఇంద్రియములు మనస్సు పుట్టినవని వేదాన్త ప్రక్రియ.
6. కరణము = కార్య సాధనము, ఇంద్రియము; మానసహంసము = హంస వంటి మనస్సును, మానస సరస్సున పుట్టిన హంసము.
10. వృత్తి = జీవనము, కిరణ ప్రసారణము.

14. మిత్రకరావలంబనము = స్నేహితుని సహాయము, సూర్యుని కిరణాధారము.
22. అలోకాధీశ్వరుఁడైన = సూర్యుఁడైన.
31. హిమాగ్రహస్తముల = చల్లని చేతుల, చల్లని కిరణముల.
32. రాజు = ప్రభువు, రాజను పేరు గలవాఁడు; జైవాతృకుఁడు = చిరంజీవి, జైవాతృకుఁడను పేరుగలవాఁడు-విధేయుఁడని తాత్పర్యము. సద్వరుఁడు = సత్పురుషులలో శ్రేష్ఠుఁడు, చుక్కల ఱేఁడు.
34. అజడాత్మకలు = చైతన్యము గలవారు; జడము = ఉడలక భేదము, జలము, నీటి స్వరూపమును బాసి సశరీరలై యని యర్థము.
35. తెలిగంటితనము = తెప్పపాటు లేని కన్నులు గలుగుట, దేవత్వము.
36. జడులకు = మూర్ఖులకు, జలస్వరూపులకు,
37. విరజ = దుమ్ములేనిది, విరజయను పేరుగలది; హరి = విష్ణువు, ఇంద్రుఁడు; రత్నసభ = రత్నములతో గట్టిన సభ, వైకుంఠము లోని మణి మంటపము; శోభిత నిత్యముక్త = ప్రకాశింపఁబడిన నిత్యులు, ముక్తులు గలది, నిత్యము ముత్యములు గలది; గోపురము = స్వర్గము, పురద్వారము.
42. పఙ్క్తిగుణము = పదియిమ్మడులు.
43. జాలము = సమూదాయము, వల; ముక్తాప్తి = ముక్తుల నొందుట, ముత్యముల నొందుట; కైవర్తకుఁడు = బోయవాఁడు.
57. ఉపమారూపణముల్ = సాదృశ్యము, సామ్యమునుఁ బట్టి ధర్మారోపణము ఉపమాలంకారము, రూపకాలంకారము; భావన = ఊహ, ఉత్ప్రేక్షా లంకారము; పరిణామవార్త = మారుట యను వార్త, పరిణామాలంకార మను వార్త; అతి ప్రసక్తి = అధికముగాఁ జెప్పుట, అతిశయోక్త్యలంకారము; సహజోక్తి = ఉన్నదున్నట్లు చెప్పుట, స్వభావోక్త్యలంకారము;
60. త్రివర్ణయుతము = మూఁడు రంగులు గలది. (అ, ఉ, మ్, అను మూఁడక్షరములు గలది. ఈ మూఁడక్షరములుకలసి (ఓమ్) అని యగును.

## ప్రథమోచ్ఛ్వాసము.

# ద్వితీయోచ్ఛ్వాసము

శ్లో॥ లక్ష్మీవిద్యుద్వలనలసత స్సత్కృపా వర్షుకస్య
శుద్ధేఽనన్తే హరిమణిరుచా భ్రాజమానస్య తస్య
దివ్యాభ్రస్య స్ఫురణగమకం ప్రాగ్దిశీ వేన్ద్రశార్ఙ్గమ్
నానారత్నద్యుతివలయి విభ్రాజతే గోపురం తత్॥

శ్లో॥ శృంగైః పంచోపనిషదమలై శ్శోభమానం ప్రమాణమ్
నిత్యం వర్ణక్రమపరిచితం సూరిభిః పాల్యమానమ్
పద్మేశప్రాప్త్యయన విశదీకార దక్షం సమక్షమ్
ద్రక్ష్యస్యగ్రే నిగమ మివ తద్గోపుర ద్వారదేశమ్.

శ్లో॥ భక్త్యోద్రేకావనతశిరసా తత్ర దీర్ఘం ప్రణమ్య
ద్వార్స్థై స్స్నిగ్ధైః ప్రకటితపథం ప్రేమదీర్ఘైః కటాక్షైః
రత్నస్థానం ప్రవిశ మహతా వైభవేనాశు తస్య
వత్సో ధ్వన్యాశ్రయ మివ ముదా కణ్ఠనిర్ముక్తరజ్జుః

శ్లో॥ సేనానాథ ప్రముఖ విబుధా స్తత్ర చ స్వంనివేశమ్
త్వా మాసీయోపరి మృదుతలే పూజయిష్యన్తి పశ్చాత్
ప్రేష్ఠా కాన్తాకరకిసలయోన్ముక్తనీరేణ పాదౌ
ప్రక్షాళ్యాదౌ ప్రణతశిరసా ధారయిష్యన్తి తీర్థమ్.

శ్లో॥ సహ్యాం ద్రైవాదివ సువిపులా ధంబుధే రంబుపూరః
ప్రాప్తోఽస్మాకం ప్రభు రయ మద స్సంస్మృతే రిత్యశేషమ్
హర్షోన్మీలన్నయనయుగళీ స్రస్త సంతోషబాష్పమ్
వక్తారస్తే చరిత మమలం విస్మితా స్స్వస్వదేవీః.

చం॥ సిరిపను మించుమించుకడు। శీఘ్రకృపార సధారలొల్కు సుం
దరరుగ నంతధామమున। నర్మలినీల మణిప్రకాశుడౌ
హరియను మేఘముండెలువు। నట్టి సురేశ్వర చాపమోయనన్
గురుతరరత్నకాన్తియుత। గోపురముఖ్యము తేజరిల్లెడున్.

ఉ॥ ఆపయి సుప్రమాణము స। మంచిత వర్ణ విశేషితంబు పం
చోపని షద్విశుద్ధశిఖ। రోజ్జ్వలమార్య సురక్షితంబు ప
ద్మాపతి లబ్ధిమార్గసుగ। మస్థలమానిగ మంబువోలె త
ద్గోపుర మస్యభాగమును। గోరికతోం దిలకింతు వీవికన్.

ఉ॥ మీరినభక్తితో సిరము। మేదినిసోంగంగ మ్రొక్కుమప్రతీ
హారులు ప్రేమ చూడ్కులని। జాజ్ఞనొసంగంగ దానిలోపలన్
జేరుము వైభవంబలర। శీఘ్రము బంధము విప్పనావుపైం
గోరిక ళుప్పతిల్లంజను। కోమలవత్సము రీతిప్రీతితోన్.

శా॥ సేనానాయకుండాదిగాగల బుధుల్। స్వీయాల యాభ్యున్నత
స్థానంబందున నీకుంబూజలిడి మీ।దన్భక్తితో స్వీయకా
న్తా నీతామలహస్త పల్లవయుగ। వ్యాముక్త నీరంబుతో
నానన్పాదము లంటిరాచి తలపై। నద్దాలు రాతీర్థమున్.

చం॥ జలధిజలంబు దైవమున। సహ్యనగంబును జేరుమాడ్కిమా
న్యులు మననాథులాభవము। నుండిటకేగి రటంచుమోదసం
కలిత నిమీలితాక్షివర। కంజగళజ్జలు లయ్యు నీదుగా
థలవచియింతు రచ్చెరువు। తారొకానంగాంధమ యంగనాళికిన్.

శ్లో॥ పూర్ణా కుంభా తదను రుచిరం దివ్యచూర్ణం శరారిమ్
స్నేహాక్షీరక్షురదురుకుచా భవ్యనీరాజనాని
ధృత్వా హిత్వా శిశిరవదనా శ్చాగమిష్యన్తి నార్యః
ప్రోస్య విశ్వా స్సుత మివ చిరేణా గతం స్వాగతేన.

శ్లో॥ నిత్యేచ్ఛాతః పరమఖపతే ర్నిత్యకైఙ్కర్య సిద్ధ్యై
దివ్యా రామాః కతిచన సదా సన్తి నిత్యా యథా శ్రీః
స్త్రీపుంసత్వాదికవినియమో నాస్తి ముక్తేషు తేషామ్
తత్సారూప్యం వదతి నిగమ స్త్వేష మార్గ స్తిరశ్చామ్.

శ్లో॥ ఏవం యాయా స్త్వ మథ సుపథా శుద్ధసత్త్వైకదేశమ్
మేశా దేశా నుగతరచనాసంమ్మిళత్సన్నివేశమ్
వైకుంఠాఖ్యం శ్రితజనమనోహారి తత్స్వప్రకాశమ్
దివ్యైర్హేమావరణ శతకై ర్భాసమానం విమానమ్.

శ్లో॥ నానాపుష్పద్రుమపరిచితైః కోకిలాలాపగీతై
ర్వాతై స్సంచాలిత మృదులతై శ్శారికాగీతపూతైః
సాంద్రై ర్నిత్యం నవనవమధు స్యన్దిభి ర్దివ్యగంధై
ర్దివ్యోద్యానైః పరివృతతలం భవ్యసోపానజాలమ్.

శ్లో॥ త్వద్గంభీరై ర్విశదశిశిరై స్సూరిణాం సన్మనోవ
న్మందాలా సోద్గతకలరవో త్ప్రేక్షితేందిందిరై శ్చ
సేవ్యై ర్దివ్యామృతరసమయై స్సంచర ద్రాజహంసైః
క్రాన్తోపాన్తం కమలలలితై స్సై రనేకై స్తటాకైః

ఉ॥ చెన్నుగఁ బూర్ణకుంభముల । శ్రీశఠగోపము దివ్యచూర్ణ మ
భ్యున్నతి మంగళారతులఁ। బూనుచుస్నేహగళత్వ య స్తనుల్
తిన్నగవత్తు రచ్చటవి । దేశచిరాగతుఁ డైన పుత్రునిం
గన్నని తల్లులాతురతఁ । గాంచఁగవచ్చిన మాడ్కిఁ బ్రీతితోఁ

ఉ॥ శ్రీలలనా మనోహరుని । సిద్ధతరెచ్చను నిత్యసేవకై .
స్త్రీలును కొందఱుందురట। శ్రీసతిఁబోలె విముక్తు లందునీ
లీలగ స్త్రీత్వపుం స్త్వములు । లేవురమేశ సరూపతా ప్తినే
మేలగు వేదముల్దెలిపె । మీఁదవచించిన పక్షులట్టులే.

మ॥ మనసా? యీవిధి మంచిత్రోవఁజనుమా।మానాయకేచ్ఛావశం
బునానావిధ సన్నివేశయుతమై । భూమిన్నవ్యయం జ్యోతియై
జనసమ్మోహక శుద్ధసత్వవిలస । స్థానంబు వైకుంఠమన్
కనకానేక విశాలసాలవలమా । నంబౌ విమానంబొగిన్.

శా॥ నానాపుష్ప తరుప్రకాండయుతమా । నందా వహచ్ఛారికా
గానోల్లాసము కోకిలాలపన శృం । గారంబు మందానిలా
ధీనాలోల లతావితానముగళ । ద్దివ్యామృతా సాంద్ర స
త్సూనా మోద వనావృతంబునది సత్సోపానమై భాసిలున్.

ఉ॥ సూరిజనంబు మాడ్కిఁహిమ । శుద్ధములైయిక నిన్నుబోలి గం
భీరములయ్యు మందరవ । వేదిత షట్పదమయ్యు హంస సం
చారవిచిత్రమై కమల । జాలమనోహరమై సుధాక్షర
న్నీరసు సేవ్యమైచెలఁగు । నిత్యతటాకము లన్నిప్రక్కలన్.

శ్లో॥ మత్కార్యార్థం ప్రియసఖ? సమాయాన్త మత్యుత్సవేన
త్వా మాహూయ ధ్వజపటమయై రగ్రహస్తై స్సమస్తైః
బ్రహ్మానందోన్మథితవలభీ పక్షివాద చ్ఛలేన
ప్రీత్యుద్దేశాత్ప్రథిత మనుపదం స్వాగతం పృచ్ఛతీవ.

శ్లో॥ జాలోద్గీర్ణాగరు మృగమదా ద్యగ్రిధూమప్రసారైః
రత్నచ్ఛాయా వ్యతికర సముల్లాసిభి స్తత్రతత్ర
కాలాధీన స్థితివిరహితైః వ్యన్తరాళేవిశాలే
స్థూలాన్నీలా శ్శకలయ దమితాన్సేంద్రచాపా న్పయోదాన్

శ్లో॥ తస్యైవాన్త శ్శ్రితమణిమయం మంటపం రత్నదీపమ్
పూర్ణానందం దశశతసహస్రాధిక స్థూణకోణమ్
నిత్యైర్ముక్తై ర్నిబిడ మజడం నిర్మలం చిన్మయేకమ్
లక్ష్మీభర్తు ర్విభవ మఖిలం లక్షయ ద్భావళీతి.

శ్లో॥ సర్వే బ్రహ్మానుభవముదితాః పంచవింశద్వయస్కాః
సర్వే దివ్యై ర్మకుటకటకైః కుండలై ర్మండితాంగాః
సర్వే హేమాంగదవరగదా శంఖ చక్రాంకితా శ్చ
సర్వే తస్మి న్నదసి పరమానందసిన్ధౌ నిమగ్నాః,

శ్లో॥ న త్వేతేషాం సహయువతిభి ర్జాయతే కామచారః
కిం త్వేతేషాం సహయువతిభి ర్జాయతే కామచారః
న త్వేతేషాం సహయువతిభి ర్వ్యోమయానే వియోగః
కిం త్వేతేషాం సహయువతిభి ర్వ్యోమయానే వియోగః.

చం॥ ప్రియసఖ? నీవునాపనికిఁ । బ్రేమమహోత్సవమొప్పరాగదా
రయమున కేతు సత్పటక । రంబులరమ్మని నిన్నుఁజీరి త
న్మయసుఖ మత్తగేహాఖగ । నాదమిషాదర భాషణంబుతో
స్మయముననద్ది మాటికిని । స్వాగతమిచ్చిన రీతిభాసిలున్.

శా॥ మాలాబద్ధ విచిత్రరత్న సుషుమా । మాన్యోదయంబై నయా
జాలోద్దీర్ణ సుగంధ ధూపపటలా । చ్ఛాదంబుతో నద్దియా
కాలాధీనముఁగాని తావునమహా । కాశంబునం దెప్పుడున్
స్థూలా నీల సహేన్ద్రచాప ఘనముల్ । సూచించునందందొగిన్.

ఉ॥ అందున రత్నదీపయుత । మయ్యుననేకము లైనకంబముల్
సుందర కోణముల్గలిగి । సూరిఘనంబయి మోదపూర్ణ స
న్మందిరమైన దివ్యమణి । మంటపమొక్కటి శుద్ధదీప్తివె
ల్గొందు రమేశసర్వవిభ । వోన్నతులన్ప్రకటింపఁజేయుచున్.

ఉ॥ అందఱు పంచవింశతివ । యస్కులు బ్రహ్మ సుఖానుభావులే
యందఱు శంఖచక్రల స । దంగదదివ్య గదాది ధారులే
యందఱు దివ్యసన్మకుటు । లద్భుత కంకణ కుండలాంగులే.
యందఱు నుండు రట్టిసభ । యందుప్రమోద మహాబ్ధిమగ్నులై.

ఉ॥ యువతులతోఁడ వీరలకు । నొప్పదొకప్పుడు కామచార మా
యువతులతోఁడ వీరలకు । నొప్పునొకప్పుడు కామచార మా
యువతులతోఁడ వీరికివి । యోగములేదు ఖయానమందునా
యువతులతోఁడ వీరికివి । యోగముఁగల్గు ఖయానమందొగిన్.

శ్లో॥ కేచి త్తస్మై నమఇతి సదా భక్తిపూర్వం నమంతః
కేచి న్నేత్రాంజలిపుటశ్చైత్ర శ్రీశరూపం పిబన్తః
కేచి చ్ఛ్రీపం హృదయకమలే న్యస్య తం లాలయన్తః
కేచి ద్భ్రాన్తా ఇవతతఇత స్సంచరిష్యన్తి తత్ర.

శ్లో॥ సౌశీల్యాఖ్యే మురరిపుగుణే మావిశం త్స్నేహభర్తుః
ఆనందాబ్ధౌ తదనుభజతాంనోమహా వర్తగర్తః
ఆయాన్తివిద్ధ న్త్వితి ఘనవచో నీరగాంభీర్య చిహ్నామ్
తస్మి న్నాదౌతరణకుశలా స్థాపయిష్యన్తి కేచిత్.

శ్లో॥ గంభీరాంభః ప్రభవవిలస త్పుండరీకాయ తాక్షమ్
లక్ష్మీనాథం పరమకృపయాఽదర్శయ న్నిత్యుదారమ్
స్వాచార్యాణా మధికవిభవం మానయిష్యన్తి కేచిత్
కేచి చ్ఛ్రీశ ప్రవిమలదయాం । భావయిష్యన్తి తస్మిన్.

శ్లో॥ శ్రీమన్నారాయణఇతివదన్సోతుకామోఽప్యశక్తో
ముక్తస్త్వేక స్స్వభర మఖిలం శ్రీపతౌ న్యస్యతీ ద్ధమ్.
పాదౌ కంపం భజతఇవ తన్మానసం బంభ్రమీతి
తత్రత్యానా మనుభవరసే నిత్య మానందభూమ్నా.

శ్లో॥ ఏవం బ్రహ్మానుభవజనిత ప్రీతికైంకర్య భాజామ్
ముక్తానాం త్వం శ్రవణమధురా న్సామగాన ప్రభేదాన్
వాదా న్స్తోష్య స్యథపరవశా న్మాం వినా మా తథాభూ
రిష్టై స్సార్థం ప్రియ! ఖలు కృతా స్వాదుతా మేతి భుక్తిః.

ఉ॥ కొందఱు "తేనమో" యనుచుఁ। గూర్మినమస్కృతిఁజేతురాహరి
న్గొందఱు కన్నువోసిడులఁ । గ్రోలుదురావిభు దివ్యరూపమున్
గొందఱు హృత్సరోజమునఁ। గూర్చుచుఁ బాడుదురారమేశుని
న్గొందఱు పిచ్చివారివలెఁ । గొండొకసేవ చెరింతురచ్చటన్.

శా॥ సౌశీల్యంబను సద్గుణంబుగలయా । స్థానంబు బోవంగరా
దీశానందమహాబ్ధిఁ గ్రోలుమనకా । క్ష్యేయేతరావ ర్తయు
గ్దేశంబయ్యది యిందుఁజేరు డనువా । క్కీలాల చిహ్నంబును
ద్దేశించచ్చటఁ బాతుచుందురు సము। త్తీర్ణ ల్బుధుల్మందుగాన్.

మ॥ అలగంభీర జలోద్భవద్వికసితా । బ్జాక్షున్ర మావల్లభున్
దిలకింపంగను జేసిరీవిధిగఁ శ్రీ । తింతామటం చాదృతా
ర్యుల స్వద్వైభవమంత నెన్నుదురు ము। ఖ్యుల్కొందఱా శ్రీశని
స్తులసిక్షేతుకహార్ద మంచుమది సం। తోషింతు రన్యుల్బుధుల్

శా॥ అన్నా? ముక్తుఁడొకండు శ్రీ సహచరు। న్ధ్యానించి యెల్గెత్తి శ్రీ
మన్నారాయణయంచు సంస్తుతిని కా। మంబున్నతాఁజేయలే
కన్నా భారము నీవెయంచు భరమా। కంజాక్షు పైనుంచుటన్
గన్నన్మానస ముబ్బుమించు పదముల్ । కంపించుమోదోన్నతిన్

ఉ॥ మోదముతోడ దాస్యములఁ। బూనెకి ముక్తుల దివ్యసామగా
నాదివిభేదము ల్చెవుల । కందము లై యలరారుచున్న యీ
వాదము లెల్ల విందువిట । బాసిననీవటు లుండఁబోకు సు
స్వాదుగనుండు గాదెతమ । వారినిగూడి భుజించుభోగముల్.

శ్లో॥ నత్వా భక్త్యా ప్రవిమలరుచే ర్మణ్డపస్యా గ్రతస్త్వం
విష్వక్సేన ప్రభృతివిబుధా న్తాన్శిరోబద్ధశస్త్రా
నస్త్రాధీశా నథ భజ ముదా పంక్తిబద్ధా న్సమృద్ధాన్
తే హ్యాఖ్యాన్త్యేషాం హరిపదజుషాం శేషిణో ద్వారభూతాః.

శ్లో॥ మధ్యే భూతిద్వయమయపదై శ్శోభితం ధర్మపీఠమ్
తస్మి న్నేకం కమల మమలం ద్వాదశాదభ్రపత్రమ్
తస్యా న్తస్థా పరమమృదులా కర్ణికా దివ్యవర్ణా
తత్రైవా స్తే సుమపరిచితా శీతలా యోగశయ్యా.

శ్లో॥ తత్రాన న్త స్సహజమృదుతా శైత్య సౌగన్ధ్య యుక్తః
రాకాచంద్రాయుతసమతనూ రాజతే రత్నజాలైః
దివ్యై స్తేజస్స్ఫురణరుచిరై ర్యత్ఫణామణ్డలాని
రూప్యాద్ర్యగ్రే జనితదినకృ న్మండలా నీవ భాన్తి.

శ్లో॥ తస్మి న్నేషాభిధఫణిఫణావారిత రత్నాంశుపుంజే
మంజుశ్రీకో విలసతి ఘనశ్యామలః కోమలాంగః
లోకాతీతే శతశతకళాపూర్ణచంద్రే యథాంకో
యద్వా వజ్రస్థగితబలిభి ద్రత్నసౌందర్యరాశిః.

శ్లో॥ దివ్యాబ్జం తన్నయనతులనాం గంతు ముద్యమ్య సద్యో
భగ్నాంస స్తత్కరతల ముపస్పృశ్యత స్తర్జనేన
పాదద్వంద్వే పతిత మభవ త్తేన చాధఃకృతంస
స్తత్రైవాస్తే గతివిరహతః ప్రాప్య తత్పీఠభావమ్.

శా॥ ఆనందాత్మకమంట పంబెదటన । త్త్యాసక్తితో మ్రొక్కి నీ
వానమాగ్రశిరోని బద్ధనిజది । వ్యాస్త్రుల్కమాసన్నుతా
సేనేశాదిక పూర్ణులన్మ్రదముతో । సేవింపుమా వీరలే
శ్రీనాథాంఘ్రి యుగాశ్రితాత్ములకువా । సిద్వారశేషుల్గదా.

ఉ॥ దానిలో భూతియుగ్మ సుప । ద్రపకరాంచిత ధర్మపీఠ మ
ద్దానికిపైన శుద్ధమగు । ద్వాదశపత్రి విచిత్రకంజమ
ద్దానికిమధ్య లోమృధుల । తత్వసుకర్ణిక దివ్యవర్ణయ
ద్దాని పయింగలుంగుసుమ । ధాపితశీతల యోగశయ్యయున్.

ఉ॥ ఆశయనంబుపైన సహా । జాద్భుతశైత్య సుగంధ మార్దవా
హీశుఁడనంతుఁ డుల్లసిలు । నిద్ధనిశాకర కోటితేజుఁడై
యాశుభమూర్తికిం బడగ । లంచితదివ్య మణి ప్రభోన్నతిన్
గాశలమొప్పె రౌప్యగిరి । కాండజభాస్కర మండలాకృతిన్.

ఉ॥ ఆకమనీయ శేషుని ఫ । ణావళిరత్నగభస్తిపుంజముం
దాకమలాక్షుఁ డభ్రనివ । హాసితకోమల దేహుఁడొప్పు ను
ల్లోకశతాధికాంశయుత । లోలశశాంక కళంకమట్లు గాఁ
గాకనువజ్ర సంస్థగిత । కజ్జలరత్న రుచిస్వరూపతన్.

చం॥ సరసిజ మీనశనేత్రముల । సామ్యముఁగోరుచు భంగమొందిత
త్కరతల మాశ్రయించెనది । తర్జనసేయఁగ నుండలేక త
చ్చరణయుగంబు నంబడఁగఁ । జాలెత దంఘ్రుల ధిక్కరింపఁదా
నరుగక పీఠరూపమున । నచ్చటనేపడి యుండనేమొకో.

శ్లో॥ నిత్యం సేవాభినుతవిషయా ణ్యాశుపంచాయుధాని
హస్తై ర్లీలాకమలమృదులై ర్లాలితాన్య ప్యజస్రమ్
తత్పాదాబ్జద్వయ మధురసాస్వాదనేచ్ఛా విశేషా
ద్రేఖారూపాం పరమపదవీ మేత్య తృప్తిం భవేన్తే.

శ్లో॥ భక్త్యా కించి త్కృతనతి రథో భవ్యనక్షత్రమాలా
తద్దివ్యాంఘ్రి ద్వితయ నఖర ప్రాజ్య సాగూప్యసిద్ధ్యై
ప్రాత ర్నిత్యం వరుణజలధౌ స్నాతి రక్తాంబరాక్తా
నోచేద్విష్ణోః పద మధిగతా స్వోదయం ప్రాప్తు మీష్టే.

శ్లో॥ ఆకారేణా వగమయతి త త్పూర్మ్వరూపం ప్రకాశా
ద్రాఃవాఖ్యాం హృదయహరణా ద్రామ తాం వర్ణమాత్రాత్
కృష్ణత్వం స్వై శ్శుభతరగుణై ర్నారసింహత్వ మేవం
సత్కోమలత్వం శ్రితజనతతే స్తత్పదాబ్జోర్ధ్వదేశః.

శ్లో॥ భోక్తౄణా మప్యధికసుఖదే స్వీయ భోగ్యాతిరేకా
ద్రంభాభోగం హసతఇవ త త్సక్థినీ యోగివేద్యమ్
తన్మధ్యం విస్ఫురదురుగుణాబద్ధ పీతాంబరేణ
విద్యుద్వల్లీ వలనజనిత ప్రాంశు పీతాంబరాభమ్.

శ్లో॥ నీలాదభ్రాభ్రసమవపుష స్తస్య గంభీరనాభి
ర్హస్తాబ్జాంకే దరవిలసితే కేశ శైవాలజాలే
లావణ్యాబ్ధా ముఖనఖరరు గ్వీచి సంఘర్షణేన
మథ్యోత్పన్నః కుసుమవిశద స్సుందరా వర్తవవ,

చం॥ అమితమునిత్య సేవఁగొని । యాడుమహాయుధ పంచకంబువై
శముగఁ గరాంబుజాతముల । లాలనసేయుచు నున్నగాని శ్రీ
రమణపదార విందమధు । రస్రుతిపానము నందునాశచేఁ
గ్రమముగఁ బాదరేఖలయి । కాంతునుదీర్చు కొనంగజాలెనో.

చం॥ సురుచిరభక్తి నమ్రముగు । చుక్కలచాలువు దేవదేవరా
డ్చరణన ఖప్రభూతగుణ । సామ్యముఁగోరుచు రాగశోభి తాం
బరమయిప్రొద్దు ప్రొద్దునను । వారుణవారిధిఁ గ్రుంకులేని చో
విరివిగనిట్లు దానికిల । విష్ణుపదోదయ మబ్బుచుండునే.

మ॥ హరిపాదోర్ధ్వతలంబు రూపమున కూ । ర్మాకారతన్కాన్తిచే
వరరాజీవత మానసాహృతిఁనిని । ర్వ్యాజంపురామత్వమున్
నరసింహత్వము సద్గుణంబునను కృ । ష్ణత్వంబు వర్ణంబుచే
ధరసత్కోలత వెల్లడించు నిటుల । న్దాసాళి కెల్లప్పుడున్.

మ॥ మురజిత్సక్థి యుగంబుభోకక్షుళి సం । భోగాస్పదంబయ్యున
వ్వ్యరసస్ఫూర్తిని జూపిమాటికి నిరం । భాభోగమున్నవ్వ బ
ల్వారగొప్పనక్కటి హేమధామవిలస । త్పీతాంబరా సక్తిచే
స్థిరవిద్యుల్లతి కాంశుపుంజ వికచ । త్పీతాంబరాభంబగున్.

మ॥ ఘననీలాంగుగభీర నాభి కరస । త్కంజాంకమై శంఖ పా
వనమైయొప్పిన కేశశైవలకలా । వణ్యాంబు ధిన్తన్నఖా
ననరుగ్ఘర్షణచేత వాటినడుమ । న్గన్పట్టి పుష్పాప్తిచే
ననయం బేర్పడుచున్న యారుచిర ది। వ్యావర్తమేయయ్యెడున్

శ్లో॥ వత్సం భర్తు ర్భవతి కమలాశుద్ధశుద్ధాన్తసౌధమ్
మన్యే తస్య త్రివళి బలిభి ర్దత్నసోపానజాలమ్
యత్రాప్యాస్తే భుజతరుమయో మానసప్రాన్తజన్మా
లీలారామ స్సకలఫలదో హేతిపుష్పాభిరామః

శ్లో॥ తస్మి న్గాత్రే ప్రవిమలతరా భాతి మందారమాలా
కంధిం ప్రాప్తేవ పదయుగజా స్వర్నదీ ద్విప్రవాహా
మధ్యే తస్యా వివిధ మణిముక్తాది శృంగారజాతమ్
ద్వీపం చిత్రద్రుమక మివ సన్నీలరత్న స్థలీకమ్.

శ్లో॥ నూనం శంఖః ప్రభవతి గళో మంగళో యస్య రావః
యద్వ్యక్తాని స్ఫుటతరకన త్సూక్తిముక్తాఫలాని
సూత్రబద్ధా న్యఖిలసుదృశాం కణ్ఠభూషాయితాని
యద్బాంధవ్యం సహభవకృతం కౌస్తుభః ప్రబ్రవీతి.

శ్లో॥ చత్వారశ్శ్రీ కచభరహితా బాహవో పీవరాంసాః
రత్నస్తంభా ఇవ భువన సంవాహకా భాన్తి నిత్యమ్
తత్పార్శ్వేఽనుకుణ ముభయతో జాగృత శ్శంఖచక్రే
రక్షాహేతో రివ గుణఖనే రాగతౌ చంద్రసూర్యౌ.

శ్లో॥ నిత్యాతృప్తామృతరసఘనే సచ్చిదానన్ద సీమ్ని
క్షీరాంబోధేః పరమదుహితు ర్జీవసర్వస్వభూతే
దివ్యే ముగ్ధస్మితశితశరచ్చంద్రికా సాన్ద్రభాగే
చిత్రం తస్మిన్దశనవసనే పద్మరాగ ప్రకాశః.

మ॥ అలపద్మాక్షుని వక్షమిందిరకు శు । ద్ధానస్థ సౌధంబగున్
వళులింద్రోపల బద్ధదివ్యతరసో । పానత్రయంబంచునే
దలఁతున్బాహుతరూర్ధ్వ శస్త్ర కుసుమో। ద్దామంబు తన్మానస
స్థలసంజాత మనేకసత్ఫలదము । ద్యానంబ టన్భాసిలున్.

మ॥ మనసా! తత్తనులగ్న దివ్యసుమ యు। జ్మాల్యంబు నెన్నన్పదా
దినజన్మించుచు రెండుపాయలయి కం । ధింజేరు మందాకినీ
వనపూరంబన నొప్పుదానినడుమ । న్భాసిల్లు శృంగార మె
ల్లను చిత్రద్రుమ నీలరత్నతల లీల న్గాంచు ద్వీపంబగున్.

ఉ॥ తప్పక శంఖమేగళము । దానిరవంబతి మంగళంబుపైఁ
జొప్పడుపల్కు ముత్తెములు । సూత్రనిబద్ధములయ్యెలోకమం
దెప్పుడు కర్ణభూషలగు । నిద్ధసుదృగ్గన పం। క్తికింపుగాఁ
జెప్పకఁజెప్పు కౌస్తుభము । జేసినసోదర భావబంధమున్.

చం॥ సిరిబలుకొవ్వు కింపయి ప్ర। సిద్ధబలాంసములైననాల్గు సుం
దరహరి బాహువుల్లగము । దాల్చెటిమేల్రతనంపుకంబముల్
పరిసరమందుఁ దెల్విఁగొని । భాసిలు శంఖము చక్రమాగఁణా
కరుననిశంబు రక్షనిడఁ । గానరుదెంచిన చంద్రసూర్యులే.

చం॥ తిరముగఁ గ్రోలినందనివి । తీరనిదివ్య సుధామయంబు బం
ధురసుఖ సచ్చిధాత్మకమ । నూనశుచిస్మిత పూతమెంతయో
సిరికనయంబు సర్వవిధ । జీవనమౌ జగమేటికాని వా
తెఱపయి పద్మరాగరుచిఁ । దెల్పుటచిత్రము గాదెమానసా!

శ్లో॥ నాసా దానభ్రమజనక దివ్యౌషధీ వల్లికాకిమ్
నేత్రే తత్రోద్గతసుమదళే శ్రీవిలోలే విశాలే
భ్రూరేఖే తత్పరిసరచర ద్భృంగ శృంగారపంక్తీ
తస్యాస్సాన్ద్రే కిసలయదళ చ్ఛేదజాలే కపోలే।

శ్లో॥ శ్రీభూనీళా ద్యఖిలవనితా లంక్రియా దర్శభూతే
పూతే గండస్థలయుగతలే తచ్ఛిరఃకంపనేషు
లీలాఖేల న్మరకతమయం కుండలద్వంద్వమగ్రే
శ్రుత్యన్తైక ప్రథితవిభవం స్వస్వ తస్యైవ వక్త్రే.

శ్లో॥ ఫాలే తస్య త్వనుసరతి దివ్యోర్ధ్వపుండ్రస్య రేఖా
శుక్లాష్టమ్యాం శశధరముఖే ప్రస్తుపియ్యూషధారామ్
మన్యే నీలాలకతతి మధ్యే తేజసాం రశ్మిఘాతాత్
ద్రష్టుర్నేత్రభ్రమణజనితాం తైమిరావర్త పంక్తిమ్.

శ్లో॥ దివ్యా కాన్తి ర్వదనకమలా దూర్ధ్వ ముజ్జృంభితా కిమ్?
కింవా రత్నస్థగితమకుట స్తత్పరత్వ ప్రకాశః?
యద్వా భూతిద్వయనివసతాం రక్షణే బద్ధచిహ్నమ్?
నోచే ద్వాచా మవిషయగుణం కింమహఃపుంజ మన్యత్?.

శ్లో॥ వామేభర్తుః ప్రియతమగుణా తత్కృపామూర్తిరేకా
నిత్యానన్యా భువనపతినా భాస్కరేణ ప్రభేవ
శ్రీదేవ్యాఖ్యా శ్రితజనతతే। ర్భాగధేయా చ్ఛకాస్తే
యద్భ్రూభంగ శ్శ్రితహితమతా ధ్యాపక స్తత్ప్రవృత్తౌ.

చం॥ పొడువగుముక్కు దాసులకు మోహముగొల్పెటిమందుతీవెయో
వెడదములైన కన్నులట । విప్పిన పువ్వుల ముద్దుతేకులో?
తొడరిసకంటి బొమ్మలవి । దూరముగాఁదిరుగాడు తేటులో?
విడువని బుగ్గలాలతకు । వింతగఁబుట్టిన పల్లవంబులో?

శా॥ నిత్యాలంకరణంబులోసతులకు । న్నిద్దంపు టద్దంబులై
యత్యుత్సాహ శిరః ప్రకంప నములం । దాగండ లోలంబులై
సత్యుండౌవిభు రత్నకుండలములా । సక్తిన్నరింబోలుచున్
శుతృన్నైకవిశాల వైభవము నే । సూచించు నెల్లప్పుడున్.

చ॥ మురహరి ఫాలభాగమున । ముద్దుగదిద్దిన యూర్ధ్వపుండ్రమ
చ్చెరువుగ శుక్లపక్షమున । జేరినయష్టమి నాటిచంద్రుపైఁ
బొరలిన యాసుధారసము । ముంగురు లన్నను వారినేత్రముల్
దిరముగఁజుట్టి మేల్గడలఁ । డీర్చినచీకటి చాల్పులేయగున్.

ఉ॥ ఆకమలాక్షు దివ్యవద । నాంబుజకాన్తియు పైనబారెనో?
కాక పరత్వసూచక మ । ఖండ మణిప్రచక కిరీటమో?
లేక విభూతియుగ్మమవ । లీలగనేల ధరించు చిహ్నమో?
కాక వచింపఁగానలవి । గాని విలక్షణ కాన్తిపుంజమో?

చం॥ పతికిని వామభాగమున । భవ్యదయామయ మూర్తిసద్గుణా
ద్భుతరవిఁ బాయనట్టిప్రభఁ । బోలెనిరంతర మట్టి లక్ష్మియా
శ్రితజన భాగధేయమునఁ । జేరివసించల భ్రూవిలాసముల్
శుృతిహిత మార్గమాహరికిఁ । జూపునుసృష్టిరచించు వేళలన్

శ్లో॥ శ్రీదేవ్యా అప్యధికఘటనాసు క్షమాచక్షమాఖ్యా
నీళా హేలాధృతసుకమలా నిర్మలా సత్కృపాలా
అన్యా దేవ్యః పతిమనుగతా దేవదేవీ కృపాతః
విద్యుద్వల్ల్యో జలముచఇవ స్యుః ప్రభో ర్దక్షిణేఽపి॥

శ్లో॥ ఏభి ర్దివ్యై శ్శుభతరగుణై ర్లక్షణై ర్లక్షయేథాః
నిత్యాచిన్త్యాద్భుతరసలసద్యౌవనం శ్రీసహాయమ్
భూమానందామృతశరనిధౌ మగ్న మాప ద్వినిఘ్నమ్
లగ్నం లక్ష్మీసుతనులతయా మన్మన స్త్వాం త్వవిఘ్నమ్॥

శ్లో॥ యద్వాన్యత్ర స్థిత మనుగతం నిత్యముక్తై స్సరూపై
ర్వక్షస్యేకా మనితరగతాం సున్దరీమిందిరాయాః
లాక్షారాగ స్ఫురితచరణ న్యాసముద్రా మవేత్య
త్వాం మన్వీథా మమకులధనం నాథ మబ్జాసనాథమ్

శ్లో॥ మన్యే నాథం ప్రకృత మయథాభూత మస్మద్వియుక్తమ్
ప్రాణే భ్యోఽప్యభ్యధికసుహృదాం స్వాశ్రితానాం వియోగే
సంపూర్ణస్య స్వయ మవికృతే శ్చాపి కశ్చి ద్వికారః
నోచే త్తస్య త్త చ్ఛుభగుణనిధే ర్నిర్దయత్వ ప్రసక్తిః

శ్లో॥ లక్ష్మ్యా తుంగ స్తనగిరితటే భ్రాజమానోఽపి నీలా
లీలా లోలేక్షణపరచిత్తోఽప్యన్యకాన్తా యుత్తోఽపి
మద్వ్యామోహా ద్భవతి వికృతో నూన మేవం హి లోకే
నూత్నాసంగాః ఖలు నరవరా స్తేషు ముఖ్య స్సురేశః

శా॥ ఆలక్ష్మీ సతికన్న మిన్న ఘటనం। బందాత్మమాదే విహే
లాలోలాంబుజ హస్త నిర్మల కృపా। లంకార యానీళ, స్త్రీ
జాలంబింకను దేవదేవి కృపతో। సవ్యేతరంబందు శ్రీ
పాలుం జేరును మేఘసక్త తటినీ। వ్రాతంబు చందంబునన్॥

శా॥ నేనీ భంగి వచించు లక్షణముల। న్వీక్షించి మత్స్వాన్త! భూ
మానందామృతమగ్నుఁడై పరమని। త్యాచిన్త్యచిత్రోల్లస
న్నానా స్వాదక యావనుష్ఘన విప। న్నాశైక దీక్షుక్రమా
జానిశ్శ్రీతనువల్లికాయుతుని ని। శ్శంకంబు లక్షింపుమా!

ఉ॥ చిత్తమ! వేరుతావు ననుఁ। జేరి సరూపుల నిత్యముక్తుల
న్వొత్తలఁగూడి యున్న నతి। విస్మృతవక్షమునందుమాత్ర మా
లత్తుక నీరు చేనలరు। లచ్చి పదాంకముఁ జూచి మత్కృలా
త్యుత్తమ విత్తమున్వతిని। యోగ్యరమాపతిగా నెఱుంగుమా

ఉ॥ నన్నెడబాసి యీతఁడిన। నాథుఁడు పూర్వమురీతి లేడటం
చెన్నెద పూర్ణుఁడై వికృతి। హీనత ముండయి నన్నిజాత్మ మే
ల్కన్నఁ బ్రియాళిఁబాసిన, వి।కారము తప్పక నొందునట్లు గా
కున్న మహా గుణాఢ్యునకు।నొందదె నిర్దయతా ప్రసక్తియున్

శా॥ ఆ పద్మాకుచ శైలతుంగ శిఖర। వ్యాముగ్ధుఁడై నన్ను నీ
ళా పూతేక్షణ వీక్షితుండయిన లీ। లన్మార్చు వారుండిన
న్నాపై మోహముగల్గి తావికృతిఁ బూ।నంజాలునిక్కంబిలన్
భూపాగ్రణ్యులునూతనాప్రియులుత।న్మంఖ్యుండునశ్వేశుడున్

శ్లో॥ స్మృత్వైత న్మద్వ్యసన మమితం సర్వవి త్సర్వసాక్షీ
వాత్సల్యాచ్చే త్సపది చ భృశం దుఃఖితో నిత్యముక్తః
దేవ్యోఽపి స్యు స్సజలనయనా స్సత్వరం వ్యగ్రభావా
స్సూర్యే మ్లానే జలరుహవనం యాతి సంకోచభావమ్

శ్లో॥ మా ముద్దిశ్య ప్రహసనధియా దోషముద్భావయ న్తీమ్
లక్ష్మీం కించి ద్ధసితవదనో వక్తి మద్దాసభూతాః
నైవంకుర్యుః ప్రకృతివశత స్స్యాద్యది స్వల్పదోషః
ఇష్టో మే తత్ప్రియవిదుష శ్చేతి మత్ప్రాణనాథః

శ్లో॥ త్రస్తా మేవం ప్రభవజలధౌ మాం సముద్ధర్తుకామః
ప్రేమ్ణా దూరా చ్చకితచకితా న్మయ్యమోఘా న్కటాక్షా
ఞ్ఛ్రీ భూభంగ స్ఫురణమహితా । న్సంజయ న్నావలసత్వమ్
స్మారం స్మారం త్వవనతశిరా వా త్వయా దృశ్యతే సః

శ్లో॥ ఏకాన్తే వా కుసుమశయనే విశ్రమార్థం శయాళుః
మత్సంభోగాభిరుచి మనిశం చిన్తయ న్జాగరూకః
నిద్రాహేతో ర్నయనకమలే మీలయిత్వా కథంచి
న్మన్నామాంకాం మధురఫణితిం వ్యాహర న్బుధ్యమానః

శ్లో॥ శీతే శేషాహిపతిశయనే వీతరాగః ప్రియాయాః
లక్ష్మ్యా స్సూక్తౌ విరుచి రపరం మానసే చిన్తయన్వా
అంగుళ్యగ్రా త్సహజగళితం స్వస్వనామాంగుళీయమ్
దత్వా శీఘ్రం ఖగకులపతి ప్రేషణేవా ప్రవృత్తః

చం॥ క్రమముగ నన్నిఁ జూచు మొన। కాఁడు జగత్త్రయసాక్షి యిట్టినా
శ్రమలఁ దలంచి ప్రీతి మెయి।సయ్యన దుఃఖితుఁడయ్యె నేని యా
కమలయు నిత్యముక్తులును।కన్నుల నీరొలుకన్ భ్రమింతురీ
కమలహితుండు వాఁడగను। కంజవనంబులు వాడకుండునే

చం॥ సిరి పరిహాస వాక్యముల। చేనను దూరఁగనట్టు లెప్డు మ
త్పరులొనరింప రాప్రకృతి। వశ్యతచే నొకవేళఁ జేసినన్
సరసుఁడనైన నాకదియు। సంబరమేయని ముద్దుమోముపైఁ
జిరునగవొప్పఁగాఁ బలుకు। శ్రీనిలయుండగు మత్ప్రియుండటన్

చం॥ ఇలభవ సాగరాంతమున। నిట్టుల జాఱిన నన్నుఁ దీయ శ్రీ
లలిత విలోల సుభ్రుకుటి। లాలితమై యలరారు ప్రేమచం
చలమగు చూపు దూరమునఁ। జాచి యనాదిని జాలసత్త్వము
న్దలఁచి తలంచి సిగ్గునవి। నమ్రశిరుండగు నాథుఁగాంచెదా.

ఉ॥ ఇంచుక సేదతీరునని। యెంచి రహస్యపు పూలసెజ్జ ని
ద్రించ మదీయభోగము స్మ। రించుచు జాగరమొందునిద్ర సా
ధించఁగ బల్మిఁ గన్నులను। దిట్టఁగ మూసినగాని నాదు నా
మాంచితమైనపల్కుఁగొని। హా!యని లేచుచునుండొకప్పుడున్

ఉ। శీతలమైన సెజ్జయగు। శేషునియందు నవీతరాగుఁడై
ప్రీతిని గొల్వు శ్రీపలుఁకు। వీనులకుం గటువయ్యె యంగుళి
వ్రాతము నుండి జాఱిన శు। భప్రదనామ వరాంగుళీయకం
బాతమ వాహనంబగు ఖ। గాధిపు తోఁడుతఁ బంప నెంచునో

శ్లో॥ లీలోద్యానే కుసుమితలతాం మత్స్వరూపాం కరేణ
ప్రస్విన్నేన ప్రతను రసకృ ల్లాలయన్వా ప్రియేతి
తత్సంస్పర్శా ద్విగళితధృతి ర్దుష్కృతా న్మే విసఙ్జ్ఞో
వారంవారం తుహినశిశిరే పాదమూలే పతన్వా

శ్లో॥ దృష్ట్వా దేవం ప్రణయజలధిం మద్వియోగా త్తప న్తమ్
మత్సందేశై రమృతమధురై ర్జీవయే స్త్వం తదాదా
పాదౌ తస్య ప్రణతశిరసా సంప్రణమ్యాపి భూయో
భూయఃప్రీత్యాకురు మమకృతే స్వా న్త దీర్ఘ ప్రణామమ్

శ్లో॥ త్వాం సంపస్య న్ప్రియతమసఖం మే రమావల్లభోఽపి
హార్దార్ద్రేణ ప్రజవ మురసా గాఢ మాలింగ్య దేవః
పృచ్ఛేత్సాశ్రుః కుశలమబలా కింసుజీవేతి కించిత్
స్వస్థం శేషోపరివిలసితం బ్రూహి సందేశవార్తామ్

శ్లో॥ త్వయ్యారబ్ధే కథయితు మిదం సౌమ్య వి స్తృత్య కర్ణౌ
దృష్ట్వాచాస్మ త్స్మృతికలుషయాత్వాంసుసంభావ్యమోదాత్
శ్రోష్యత్యార్యః పరమభిముఖో విప్రయోగే ప్రియాయాః
వార్తాలాభ స్సహృదయ ముఖా త్కామినాం ప్రాణలాభః

శ్లో॥ స్వామి న్నాత్మప్రియతమసఖి క్షేత్రిగా నన్యభావా
త్వత్పాదాంభోరుహాయుగ మధుస్వాదనాశావరుద్ధా
జీవ న్తీ త్వాం కుశల మవద ద్దుఃఖసిన్నా స్థితా పి
స్యా దాశాస్యం ప్రథమసుఫలం హ్యేత దేవ ప్రియాయాః

చం॥ అతితను గాత్రుఁడై వనము। నందున నావలెనున్న పుష్పిత
ప్రతతిని స్విన్నహస్తమున। ప్రాణసఖీ! యని బుజ్జగించు న
ద్భుతముగ దానినంటి మద। పుణ్యవిశేష ఫలంబుచే విసం
జ్ఞతఁగొని వ్రాలు మాటికిని। చల్లని పాదతలంబు నందిలన్

చం॥ పరమ దయా సముద్రునను। బాసితపించు సురేశు గాంచి మ
త్పరిచిత సత్సుధామధుర। వార్తలతోఁ బ్రతికింపు నీవు త
చ్చరణ యుగంబున న్మొదట। సాగిలిమ్రొక్కినగాని మళ్లి సం
బురమున నాదు పక్షమున। భూరిన మస్కృతి నాదరింపుమా॥

శా॥ నిన్నున్నాప్రియమిత్రుఁగాంచుచరమా।నిర్వాహకుండై నయా
వెన్నుఁడెంతయొ ప్రీతి నక్కునను వే। వేగంబుగాఁజేర్చి తాఁ
గన్నుల్నీరొలుకంగ నచ్చెలికిసా। ఖ్యంబే? యను న్గొంచె మా
సన్నస్వాంతున నంత సంస్థితునితో। సందేశముం దెల్పుమా!

ఉ॥ నీవు వచింపఁబూను నెడ। నీరజపత్ర విశాలనేత్రుఁ డా
దేవుఁడు సావధానుఁడయి। తీరికగాఁ జెవులెల్ల విప్పి మ
ద్భావము నాలకించు ప్రియ। వర్గము దెచ్చిన యాత్మకామినీ
భావుకవార్త కాముకుల। పాలిటి ప్రాణముఁగాద సౌమ్యుఁడా?

ఉ॥ శ్రీసఖ? నీదు ప్రేమసఖి। క్షేత్రముఁజేరి యనన్యభావయై
వాసిగ నీ పదాంబురుహా। భవ్య మరందముఁగ్రోల నెంతయో
యాసలోఁ జిక్కినిల్చె విప। దంబుధిఁ గ్రుంకుచునీ శుభం బెవి
శ్వాసముతోడఁ బల్కె తొలి।వాంఛిత లాభమిదే ప్రియాళికిన్

శ్లో॥ త్వన్నామాంకం త్రిపదకసువర్ణాష్ట సూత్రానుబద్ధమ్
మాంగల్యం స్వం గళలసదనన్యార్థ్వితా సూచకం తత్
దృష్ట్వా శ్రుత్వా గురుగణముఖా ద్వైభవంతావకీనమ్
ముగ్ధా స్నిగ్ధా త్వయి నిజపతౌ కామసంతాపదగ్ధా

శ్లో॥ ఆధివ్యాధ్యైరమితవిషయ క్షుద్రగుల్మై రుపేతే
భీతా భీష్మై ర్భవమరువనే శత్రుభి ష్షడ్భిర న్తః
గూఢై ర్బాధం త్రిగుణఘటితే మోహజాలే నిబద్ధా
త్వాం ప్రేమాన్ధా ప్రభవతి కథం సాబలా ద్రష్టుమీశమ్

శ్లో॥ సైషా బాలా సదయ ? విజనే ధ్యానయోగే ప్రవిష్టా
దివ్యం రూపం హృదయకమలే తే ప్రియా స్వప్నతుల్యమ్
కించిత్కించి త్ప్రకృతి వివశా ప్రేక్ష్య తూర్ణం ప్రబుద్ధా
స్వప్నే దృష్టం ధనమివబహిః ప్రాప్తు మాకాంక్షతీదమ్

శ్లో॥ విన్యస్యాదౌ త్వయి నిజభరం నిర్భరాఽకించనాసా
త్వత్కైంకర్య ప్రణిహితధియా సర్వగం ముక్తిదం త్వామ్
అన్విష్య న్తీ దిశిదిశి దృశః ప్రేషయ న్తీ దివాఽపి
శ్రాన్తా నిత్యంగమయతి నిశాం దుఃఖితా కల్పకల్పామ్.

శ్లో॥ కృష్ణేతి త్వాం వదతి మధురం గారుడే పక్షిభేదే
పశ్య త్యూర్ధ్వం తదుపరి తవాభావ్యమం చి న్తయ న్తీ
ఆశాభంగా దవనతముఖీ బాష్పసిక్త స్తనాగ్రా
ప్రాప్నోత్యన్యా మపితరుగణై శ్శోచనీయా మవస్థామ్.

శ్లో॥ హరి! త్వన్నామవి చిత్రమై త్రిపదకం। బైనత్సు వర్ణాష్టసూ
త్రేరమా శోభితమై యనన్యవిషయ। త్వద్యోతకంబాగళా
న్తరమాంగల్యముఁజూచి నీ మహిమ పెద్దజ్జెప్పనాలించిసుం
దరిని న్నే పతిగాఁ దలంచికుసుమా। త్రస్తభ్రాన్త యయ్యెన్జుమా!

చం॥ వెతలనుబెబ్బు లుల్విషయ। విశ్రుతకుంజము లొప్పచున్న సం
సృతిమరు కాననంబున వి। శేషముగానరి షట్కమాగుణ
త్రితయవిమోహజాలమున। దించిభయంబును గూర్ప్రబేమమో
హితనయనాబ్జ యాయబల। యీశ్వర!నిన్గన నోపునెట్టులన్.

మ॥ అలపూఁబోడి రహస్యయోగమునని। ధ్యానించి హృత్పంకజ
స్థలి నీసుందర రూపునా ప్రకృతికి। న్స్వాధీనమైసిగ్గులో
గలుఁగనొక్కంచెము జూచియాపిదపవే। గన్తాను మేల్గాంచుచు
న్కలలోఁజూచిన పెన్నిధానమునిల। న్కాంక్షించుజాగ్రద్దశన్.

చం॥ మొదటనె నీపయిన్భరము। బూనియకించన నిర్భరాత్మ త్వ
త్పదయుగ సేవకై యఖిల। ధాముముకుందుఁడవైన నిన్నువల్
వెదకుచు దిక్కుదిక్కులను। వేమరుచూపులఁ బంపిఖిన్న యా
పదఁపడి రాత్రులంగడపు। బాపురే! కోటియుగంబుచాడ్పునన్.

చం॥ వలపునఁ దియ్యఁగాగరుడ। పక్షివిశేషము కృష్ణయంచు ని
న్బిలువఁగ నీవువత్తువని। పైఁదిలకించి నిరాశఁజెందుచున్
జలజలకంటి ధారలుకా। చంబులజాఱ మొగంబువంచియా
వల తరుశోచనీయదుర। వస్థనుబొందు విలక్షణంబుగాన్.

శ్లో॥ కృష్ణాసక్త్యా నిరుపమకలా చంద్రలేఖేవ నిత్యమ్
క్షీణాఽత్మానం జలరుహాసుతానాథ శేషత్వదూరమ్
చాత్మీయంవా భువి నసహతే కింపున ర్భోగ్యజాతమ్
స్త్రబ్ధాఽకాండే కిమపి మధురం భాషతే స్వాన్తరేవ.

శ్లో॥ అర్చ్యం రూపం తవ సుమదళైః పూజితుంవా ప్రవృత్తా
పాదౌ తస్య ప్రవిమలతరైః క్షాళయ త్యశ్రుపూరైః
మధ్యేమధ్యే కృతమపి విధిప్రక్రమం విస్మరన్తీ
దత్తం పుష్పం పునరపిపున । ర్దేవ తస్మై దదాతి.

శ్లో॥ ఇత్యేవం మద్వ్యసనమఖిలం స్వామినే త్వం నివేద్య
స్త్రీచాపల్యా త్ప్రణయనిధయేఽ ప్రేషయ చ్చాన్తరంగమ్
దోషం చైతం ప్రియజనకృతం త్వం క్షమస్వేతి భూయో
వాచ్యం సర్వం వద పరమత స్తత్కృపైవ ప్రమాణమ్.

శ్లో॥ శ్రుత్వా వార్తాం వివశకథితాం మానస శ్వేతపక్షు
శ్శీఘ్రం గత్వా కమలనయనం దీనవాచాఽచచక్షే
శ్రీనాథోఽపి స్వయ మరమిమా మేత్య నిర్ముక్తబన్ధా
మిష్టై ర్భోగై రభజత సదా నన్దకన్దే పదేపి.

శ్లో॥ సప్తర్త్వాశావిధుమితశకే శ్రీమతా కృష్ణనామ్నా
మందాక్రాన్తానుగుణరచనాగుంభితా । సూక్తి రత్నైః
ముక్తైశ్వర్య స్ఫురదురుమనోహంస సందేశమాలా
సారార్థేయం సరసవిదుషాం కణ్ఠభూషాయితా స్యాత్.

మ॥ అరయన్నిత్యము చంద్రలేఖవలె కృష్ణాసక్తిచే క్షీణయై
హారిశేషత్వ వివర్జితాత్మ నుతదీ। యంబెల్ల నాశింపదే
కరణిన్భోగముఁ గోరునచ్యుతుదకా। కాన్తాలలామంబు దు
ర్భరదుఃఖంబున నూరకన్మధురమా। భాషించు లోలోపలన్.

చం॥ ముదమున నర్చ్యరూపమును! పువ్వుల రేకులఁబూజసేయుచున్
వదలక జాఱు బాష్పముల। పాద్యముగూర్చును ముందుపూజలో
బదఁపడి యప్పటప్పటికి। పాటినివిస్మరణంబుఁజెందుచున్
విదితముగాఁగ దానిపయిఁ। బెట్టినపుష్పముఁ బెట్టుచుండికన్.

ఉ॥ ఈవిధినీవు నావెతల। నెల్లనుస్వామికి విన్నవించి స్త్రీ
భావముఁతోఁడు తన్ప్రణయ। బంధువటంచుని జాన్తరంగునిన్
బోవుమటంచుఁ దోలుసఖి। బూనినదోషము లక్షమించుమో
దేవ! యటంచుఁ జెప్పఁదగు। తీరునఁజెప్పుము వాని ప్రేమయే.

చం॥ పరవశతోక్త వార్తవిని। భాసురమానస రాజహంస తోం
దరగనువెళ్ళి యాహరికిఁ। తప్పకదీనము గావచించె శ్రీ
వరుఁడును వేగమిచ్చ్యకొని। వచ్చుచుబంధ విముక్తిఁజేసి సం
బురమున భోగముల్సలిపె। మోక్షపదంబున నాత్మకాన్తతోన్.

మ॥ మునిషణ్ణాగశశాంకసచ్ఛకమున। న్మక్తాను బద్ధోక్తిర
త్ననితాంతోజ్జ్వల మైనరీతిగను మం। దాక్రాన్తవృత్తంబుతో
జనసేవ్యంబుగ కృష్ణగుంభితమన। స్సందేశమాల్యంబువి
జ్జనకంఠంబున భూషణంబగుత త। త్సారార్థ ముల్బూర్చుచున్.

అ॥ వె॥ సర్వధారినామ సంవత్సరంబు వైశాఖశుక్లదశమి, వరుసభౌమ
వాసరంబునందు వరకృష్ణమాచార్య । శతవధాని యాంధ్ర
సరణిఁ గూర్చె॥

ఇట్లు శ్రీ మత్సదాచార్య కృపాలబ్ధ సారస్వతుఁడగు శ్రీకృష్ణ
మాచార్య శతావధాని కృతులందు నాంధ్రపద్యసహిత
మ న స్సం దే శ కా వ్య ము న
ద్వి తీ యో చ్ఛ్వా స ము,
శ్రీ వేంకటేశార్పణ మస్తు.

---

## క ఠి న ప ద ప్ర దీ పి క

2. సుప్రమాణము = మంచి ప్రామాణ్యముఁగలది, మంచి ప్రమాణమయినది; వర్ణవిశేషితంబు = రంగులతోఁ జిత్రింపఁ బడినది, అక్షరములతో విశేషింపఁ బడినది; పంచోపనిషద్విశుద్ధ శిఖరోజ్జ్వలము = పంచోపనిషత్తులని పేరుగాంచిన యప్రాకృత పంచభూతములచే పరిశుద్ధమయిన యగ్రములచేఁ బ్రకాశించునది, తైత్తిరీయ పంచోపనిషత్తులచేఁ బ్రకాశించునది; ఆర్యసురక్షితంబు = జయవిజయాదులచే రక్షింపఁ బడునది, పెద్దలచే రక్షింపఁ బడునది.

14. కామచారము = మదనకేళి, యథేష్ట సంచారము; వియోగము = ఎడబాపు వి = పక్షియగు గరుడుని; యోగము = వాహనముగా సంయోగము; వియానము = ఆకాశ సంచారము.

16. కీలాల చిహ్నము = నీటిలోతు తెలియుటకు పాతిన కంబము.
భక్తి = పూజ్యులయందు ప్రేమ, ఒకరీతి క్రమము, రాగశోభితాంబరము = ఎఱ్ఱదనముచేఁ బ్రకాశింపఁబడిన యాకాశము, కాషాయవస్త్రము; విష్ణు

పదోదయము = నారాయణుని పాదములయందున్న యైశ్వర్యము; విష్ణు పద = ఆకాశమునందు; ఉదయము = పుట్టుట.

27. కూర్మాకారత = తాబేటి రూపమువంటి రూపము, కూర్మావ తారత్వము; రాజీవత = కమలత్వము, మత్స్యావ తారత్వము; రామత్వము = మనోహర త్వము శ్రీరామ, పరశురామ, బలరామత్వము; నరసింహత్వము = పురుష శ్రేష్ఠత్వము, నరసింహావ తారత్వము; కృష్ణత్వము = నల్లదనము, కృష్ణావ తారత్వము; సత్కోలత్వము = మంచిగోళ్ళు కలిగియుండుట, వరాహావ తారత్వము.

28. రంభా భోగము = అరఁటికంబపు విశాలత, రంభయొక్క భోగము, పీతాంబరము = పచ్చని పట్టము, పచ్చని యాకాశము.

31. కంధిం జేరు = సముద్రముఁ జేరు, కంఠమును జేరు.

32. సూత్రనిబద్ధములు = బ్రహ్మసూత్రములచేఁ గూర్చఁబడినవి. దారములచేఁ గట్టఁబడినవి. సుదృగ్జనము = విద్వాంసులు, స్త్రీలు.

36. శ్రుత్యంతైకవిశాల వైభవము = చెవుల కొనయందు ముఖ్యముగా విస్తార వైభ వము. వేదాంతములయందు విస్తార వైభవము.

51. పాదతలము = చెట్టు మొదటు, కాళ్ళపయిన.

56. త్రిపదకము = మూడుపదములు గలది, మూడు పతకములవలె నుండునది సువర్ణాష్ట సూత్రరమాశోభిత = మంచియక్షరములే యెనిమిది సూత్రములు (గొప్ప అర్థమును బోధించునవి) వాటితోఁ బ్రకాశించునది, బంగారముతోఁ జేయబడిన యెనిమిది దారములతోఁ బ్రకాశించునది.

61. కృష్ణాసక్తిచే = కృష్ణుఁడనైన నీయందాసక్తిచే, కృష్ణపక్షమందాసక్తిచే.

66. ముని = (౭) షట్ = (౬) నాగ (౮) శశాంక (౧) (౧౮౬౭) శాలివాహన శకము; ముక్తానుబంధోక్తి = ముక్తులకు సంబంధించిన వాక్యము, ముత్య ములకు సంబంధించినది; మందాక్రాంతమనే వృత్తముతో, మెల్లగానాక్ర మింపఁబడిన గుండ్రని తనముతో.



# అర్చిరాది సంగ్రహము

మ॥ వరుసన్బుట్టుచు గిట్టుచున్నరక గ । ర్భభ్రాంతుఁడై ఘోర సం
సరణార్ణవములోన దుఃఖపడఁ గ । న్సర్వేశ నిర్హేతుక
స్ఫురితామోఘ కృపానిరీక్షణ సము।ద్భూతాగ్రి సత్త్వుండునై
పురుషుండాత్మ గుణోన్నతుండయిసదా మోక్షార్థచింతారతిన్

మ॥ భువిసత్సంగతి నిస్పృహుండుగుర స।ద్బోధన్సరిన్గాంచి క
ర్మవితానంబునసింప నల్పమగు ప్రా।రబ్ధంబు భోగించి యా
యవిచాల్యేశ్వర సత్కృపం దుదకుమా।యాబంధముల్వీడిహృ
ద్భవ దేవానుగృహీత సూక్ష్మథమని।ద్వారాధ్వనిర్ముక్తుడై.

మ॥ మహితార్చిర్దిన పూర్వపక్ష షడుద । గ్మాసాబ్ద వాతాంశుమ
త్తుహినజ్యోతి తటిజ్జలాధిపబుధో । త్తుంగేశ భాషాధిరా
ణ్మహితుండై విరజాంబులాడి పరగన్ । వైకుంఠ మందారమో
ద్వహము సాయుజ్యమునొంది పొందుహరితో । ధన్యాత్ము డానం
దమున్.

కం॥ ప్రతిదినము ముముక్షు జనులీ
గతివేకువ నర్చిరాది । గతిచింతనకై
యతిసంగ్రహించి వ్రాసెను
మతికృష్ణ శతావధాని । మాన్యుల కృపతోఁ.

సంపూర్ణము.